మ౹ రా౹ రా౹ ౬౨ గాంధీ

Reg: No: M: సం౹౹రం. చందా 3—0—0

# స్వతంత్ర రైతు

ప్రతి శుక్రవారము ప్రకటింప బడును.

సంపాదకుడు:— కేశిరెడ్డి శేషురెడ్డి.

సంపుటము ౧ ౧౯౩౦ అక్టోబరు తే ౩౦ ది శుక్రవారము. సంచిక ౫

## వ్యాఖ్యలు.

### ఆంధ్ర రాష్ట్ర జమీందారీ రైతు సంఘము

ఏ మహానీయులో లోక సంగ్రహణార్థము పూర్వ కాలమున స్వార్థత్యాగులయి సన్యాసులయి కొన్ని ప్రదేశములను నిలయములుగ చేసికొని దేశ,హితైక ప్రబోధము గావించుచుండినందున వారి నిలయములు జనాకర్షణీయములయి పీఠములన బడుచు ప్రఖ్యాతి వహించుచుండినవి. వీర స్థాపకులు పరమపదించిన వెనుక వారి స్థానములను స్వార్థపరు లాక్రమించి దేశమును పీడించినను పూర్వ గౌరవమును పాటించు పౌరులు వారికి మర్యాదలు చేయుట మనమెరుగుదుము. ఆంధ్రదేశములో నేడు కాంగ్రెసు మహాసభ ప్రభావ సందర్భమున ఊరుపేరు లేని సంఘములు బయలుదేరుచున్నవి. వానికి సభ్యులుండరు. కార్యవర్గముండదు, అధ్యక్షుడసలే యుండడు. ఎవడో ఒక వ్యక్తి కార్యదర్శి యని పత్రికలలో తన పేరును ప్రచురించుకొనుచుండును. మా ఆంధ్ర జమీందారీ రైతు సంఘ కార్యదర్శి గారగు శ్రీ మందేశ్వర శర్మ గారి రోగము ఉండిన వారా? లేక నిజముగా నొక సంఘముండి దానికి నిర్మాణముండి, సభ్యులుండి, జీవించి యున్నదా? దీనికి అధ్యక్షు లెవరో కార్యనిర్వాహకు లెవరో ఎన్నిక లెప్పుడెచట జరిగినవో ఏం కేరీత్యా కార్యదర్శి పదవి లభ్యపడినదో వివరములు శ్రీ మందేశ్వర శర్మ గారు గానీ ఇతరులు గానీ పత్రికా ముఖమున వెలువరించిన వారు శ్రీ జవహర్ లాలుగారికి వ్రాసిన కథా వృత్తాంతము తరువాత వివరింపబడును.

—

### నెల్లూరు జిల్లా కాంగ్రెసు సంఘము

మన జిల్లా కాంగ్రెసు సంఘము వారు అల్లూరులో సమావేశమయి క్రొత్త ఎన్నికలు జరిపినది మొదలు కీర్తి హీనులయి యున్నారు. శ్రీ బొమ్మా శేషురెడ్డి గారి ఆధిపత్యమును నిరసించి విశ్వాస రాహిత్య తీర్మానమును అభిలషించుచు శ్రీ రెడ్డి గారిని పద భ్రష్టుల జేసినంత వరకు ఏక దీక్షా కంకణులయిన మహనీయులు నేడు ముచ్చటకయినను గాన బడుట లేదు. కాంగ్రెసు ఆఫీసునకు గట్టి తాళములే వేయబడి యున్నవి.

... ... ...

కాంగ్రెసు సంఘము వయిన పౌరులకు గల అభిమానముచేత ఊరు పేరు లేని వ్యక్తులు జవాబుదారీ పదవుల నందినను, పరువుకి భంగము గాకుండ సంఘపు గౌరవమును గాపాడిరి, గాని జవాబుదారీ లేని నాయకులు అవకాశమునకు గాని ఊరంత కాంగ్రెసు పేరట అప్పులు చేసి జవాబు చెప్పకుండా పోవుటచేత సంఘమునకు కళంకము గల్గుచున్నది. ఇప్పటిలో కాంగ్రెసువారు సమావేశమయి యీ కళంకము దిద్దుబాటు నిలయ మార్గములు అన్వేషించుదురుగాక



వాని బిడ్డ పుట్టినందుకు గొప్పబహుమతి యొసగబడెను. అప్పుడు జనసంఖ్య 79,999 గా నుండునప్పుడు 8,000 వ బిడ్డకు బహుమతి నొసగుటకు అధికారులు నిశ్చయించుకొనిరి. కొంతకాలము జననములు లేక సెప్టంబరు నె 18 ది కొత్తబిడ్డ ఒక బీదవానికి పుట్టెను. ఆ బిడ్డకు కట్నములును, వాని తల్లికి వేనకు వేలు సన్మానములు ఆయూరివారు పంపిరి.

◆ ◆ ◆

చికాగో నగరములో ఉపాధ్యాయుల స్థితి.

ఇండియాలోని ఉపాధ్యాయులకన్న చికాగోలోని ఉపాధ్యాయుల గతి చాల దుర్భరముగనున్నది. అచ్చట నిచ్చెడి జీతము సమస్యగాను. ఏప్రెలునుంచి జీతము ఇచ్చుటలేదు. జీత బత్యము జరుగని వారికి చీటివ్రాసి యిచ్చిన పక్షమున వుగాను వర్తకులు చిల్లర సామానులు యిచ్చి కాలము జరుపుచున్నారట. ఇంతవరకు విద్యా సంఘము నౌకరులకు 2,460,000 పౌనులు గాంటు రావలయునట.

◆ ◆ ◆

చీనాకును జపానుకును జరుగు సంగ్రామ ప్రారంభమున చీనాదేశపు అధ్యక్షుడు సైన్యముయొక్క పవిత్ర రీతమునకై క్రింది 10 అంశములను ప్రకటించెను.

1. నీవు తుపాకులను దొంగిలించవద్దు
2. నీవు మరణించుటకు భయపడవద్దు.
3. నీవు ఆడంబరముగా కనుపడవద్దు.
4. నీవు గర్వపడవద్దు.
5. నీవు సోమరిగా నుండవద్దు.
6. నీవు వ్యభిచారముగాని జూదముగాని చేయవద్దు.
7. నీవు పొగ త్రాగవద్దు.
8. నీవు డబ్బు అప్పుతీసికొనవద్దు.
9. నీవు సారాయి త్రాగవద్దు.
10. నీవు అసత్యము పలుకవద్దు.

◆ ◆ ◆

గత సంవత్సరము సయినికి శాసనము అమలులో నుండుటచే ఖైదీ చేయబడిన ఆఫ్రిదీలు దొరతనము వారితో రాజీచేసికొన్నందున విడుదలచేయబడిరి,

◆ ◆ ◆

గాంధీ నగరములో భరతపషణముందంలెటను

రు 8,20,000 ఖద్దరు విక్రియమయ్యెను. బొంబాయి నగరమునందే రు 2,45000 వెలవే యున్నది.

◆ ◆ ◆

లండను నందు వెలింగ్టను డైరీలో మేకల ప్రదర్శనము జరుగును. అందు మహాత్మగాంధిగారు ఆహ్వానింపబడిరి.

◆ ◆ ◆

14 నెలలు చెడని శవము.

బెంగుళూరు క్యాంటోన్మెంటులో ఫాదర్ సైలెట్ అను రోమను క్యాతలిక్ మతబోధకుని శవమును 14 నెలల క్రితము భూస్థాపితము చేయబడెను. వీరి అస్థిని వుడా చేరికి కొనిపోవలయునని ఆ స్థలమును త్రవ్వగా, కళేబరము చెక్కు చెదరక యుండెను. బ్రతికి యున్నవాని ఎముకలవలె నాతని ఎముకలు మెత్తగా నుండెను. దేహము చెడలేదు వాసన కొట్టలేదు. ఈగలు ముసరుటలేదు. ఇది ఒక అద్భుతముగా నందరును తలచుచున్నారు.

◆ ◆ ◆

లండనులో కింగ్సులే హాలులో కొలంబియా గ్రామఫోను కంపెనీవారు గాంధీగారి ఉపన్యాసమును రికార్డు తీయగోరగా మహాత్ముడు సమ్మతించి 6½ నిముషముల సేపు "భగవంతుడు గలడు" అను విషయమును గూర్చి ఉపన్యసించిరి,

◆ ◆ ◆

ప్రారంభ విద్యాచట్టమునందు గవర్నమెంటు వారు కొన్ని నూతన సవరణలు గావింపనున్నారు. ఇందులో నిర్బంధ విద్య గరపు చోట్ల, ఉచిత విద్య గరపవలయునను మరియును చేర్చెదరట.

◆ ◆ ◆

ఈ నెల తే 18 ది ఏలూరులో హిందూ యువజన సంఘ భవనమున డిప్యూటి కలెక్టరు రావు బహాదర్ వి. వెంకటరమణయ్య నాయుడుగారి యాజమాన్యమున రయితు మహాజనసభ జరిగినది. కాంగ్రెసు నాయకులు దండు నారాయణ రాజు, వడ్లపట్ల గంగరాజు, ఉప్పులూరి పట్టాభిరామయ్య, కొమ్మారెడ్డి ఆంజనేయులు పయిడిపాటి వెంకటనారాయణరు పై సభలో పాల్గొనుటకు కోరిరి. డిప్యూటి కలెక్టరు గారు అనుమతి నొసంగుటకు నిరాకరించిరి. పబ్లీకు మీటింగులో మాట్లాడుటకు అందరకు హక్కు గలదు గనుక తమకు అనుజ్ఞ నొసగవలయునని పట్టుబట్టిరి. అధ్యక్షులు సగము భాగము సభ అశాస్త్రీయముగా తీర్మానించి, పై వివరింపబడిన కాంగ్రెసు నాయకుల నరెస్టు చేసిరి. వీరందరు బైలుమీద విడుదల చేయబడిరి.

